# పందిళ్లమ్మ శతకము.

“ వాగ్గేయకారహర్యక్షు ”

విరచితము

మొదటికూర్పు 500 ప్రతులు

చీరాల, శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1938

 [వెల రు 0—2—0.



# పందిళ్లమ్మశతకము.

"వాగ్గేయకారహర్యక్ష" కట్టా అచ్చయ్యకవి

విరచితము

మొదటికూర్పు 500 ప్రతులు.

చీరాల, శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1938



[వెల రు 0—2—0.

# ఆశీస్సు

కం॥ శ్రీమద్దేవీభక్త శి
ఖామణి యొకఁడు ప్రదానకలితమనస్కుం
డీముద్రిణాభృతి యిడె శత
కామృతపాత్రమును చేతికందిచ్చినటుల్॥

కం॥ సుకవీశ్వరుండు కృతిక
న్యకఁ గాంచినయంతనె ఘనమా ? యద్దానిన్
బ్రకటించు దాత, చేకొని
సుకించు నేత దొరకినన సుకృతమనదగున్॥

కం॥ ఆయుత్తమభక్తునిఁ గా
త్యాయని విద్యాచిరాయురారోగ్యయశ
శ్శ్రీయుతుఁ జేయుంగాత ! కృ
పాయత్తస్వాంతయగుచు నని దీవింతున్॥

గ్రంధకర్త.

# వందిళ్లమ్మశతకము

కం॥ శ్రీమచ్ఛక్తి వనంగా
భూమిని వందిళ్లపల్లిపురవరమునయం
దామోదంబున వెలసిన
భామాజనకల్పకమ్మ ! వందిళ్లమ్మా॥ 1

కం॥ కాళీ ! వృజినసమీరవ
వ్యాళీ ! సంభ్రాజితామవాళీ ! గుణరిం
ఛోళీ ! శ్రుతిహిత మృదువాక్
పాళీ ! కాపాడుమమ్మ ! వందిళ్లమ్మా॥ 2

కం॥ దుర్గా ! పాలితకవిబుధ
వర్గా ! నిలయీకృతాప వర్గా ! నిలస
న్మార్గ ! జయనిసర్గ ! ముదిత
భర్గా ! నను బ్రోవుమమ్మ ! వందిళ్లమ్మా॥ 3

కం॥ గౌరీ ! వేదారణ్యా మ
యూరీ ! వాగ్విజితకీరి ! యుగ్రప్రియ ! కౌ
మారీ ! నుతజంభారీ !
వారింపగదమ్మ ! భవము వందిళ్లమ్మా॥ 4

కం॥ అంబా ! నవరత్న ప్రా
లంబా ! నిరుపమకృపావలంబా ! సుజ్ఞా
నాంబా ! మోక్షద భవతా
పం బాపంజూడుమమ్మ ! వందిళ్లమ్మా॥ 5

క॥ దేవీ! శ్రీకైవల్యపు
దీవీ! యరిగూల్చు క్రోవి తెలివియలరునె
త్రావీ! నుడితేనియ నడ
బావీ! నీకేవి సామ్య? పందిళ్లమ్మా॥ 6

క॥ కొందఱు గోటియుపాటుల్లన్
గొందఱు టెంకాయలిచ్చి కొల్తురు నే నీ
కుందనవిగ గందపు లోక
వంద సమర్పింతునమ్మ! పందిళ్లమ్మా॥ 7

క॥ నిక్కపు భక్తుండనఁ గని
యొక్కడె కొల్చి కొలిపించు నోరుచే ధనికుల్
దక్కరులని తెలిసి మధురు
వాక్కులు నాకీయుమమ్మ! పందిళ్లమ్మా॥ 8

క॥ ఆకాళిదాసు మును ని
న్నేకరణిన్ గొల్చి వాగమృతధారాను
శ్రీకలితకావ్యఘటనా
పాకము గడియించెనమ్మ! పందిళ్లమ్మా॥ 9

క॥ విద్యాగంధమె నీస్మర
ణోద్యోగమునకు ఫలమనియును బూజింతున్
బాద్యాదికోముల భక్తిన్
బ్రిద్యోదిత కరుణగొమ్మ! పందిళ్ళమ్మా॥ 10

కం॥ పలుమారులఁ నీపూజకు
వలనొప్పఁగ బత్రి పుష్ప ఫల తోయములన్
సులువుగ గొని మత్కవితో
త్పలగంధియె తెచ్చునమ్మ! పందిళ్ళమ్మా॥ 11

కం॥ నీకిదె గ్రంధము పత్రిము
శ్లోకము పుష్పంబు భక్తి సురుచిరఫల మ
స్తోకరసము తోయమ్మని
ప్రాకటముగ నెంచవమ్మ! పందిళ్ళమ్మా॥ 12

కం॥ పత్రమ్మా శత్రున కసి
పత్రమ్మాయోగపాత పత్రిమ్మా స
త్పాత్రమ్మా నుతికిని శత
పత్రాయతనేత్రవమ్మ! పందిళ్ళమ్మా॥ 13

కం॥ పుష్పము భక్తునిగాచుఁ
దుష్పరిణతి నాపిచేయు త్రుటికాలమునన్
గీష్పతి నానందమహా
బాష్పము లురలించునమ్మ! పందిళ్లమ్మా॥ 14

కం॥ ఫలము బహుళశతీధాటన
ఫలము నొడంగూర్చు వేదపారాయణసత్
ఫలమును జేర్చు ఘనతపః
ఫలమును సమకూర్చునమ్మ! పందిళ్లమ్మా॥ 15

కం॥ తోయం బఘపుంజము గడ
ద్రోయందొడఁగఁగ సతంబరులపై గత్తిన్
దూయంగడఁగఁగ వివిధో
పాయంబుల్ సూపునమ్మ పండిళ్ళమ్మా॥ 16

కం॥ నవరసయుక్తంబగు మ
త్కవితానైవేద్య మర్పితంబుగ జేతున్
శివురాణీ! నాకుంగల
భవభయముం బాపుమమ్మ! పండిళ్లమ్మా॥ 17

కం॥ మత్కవితా సాగరమున
సత్కావ్యమ్ములను మణులెసగ నీదయచే నం
పత్కరములగుచు నవి యా
పత్కాలము గడపునమ్మ! పండిళ్లమ్మా॥ 18

కం॥ ఎన్నియలంకారము లవి
యున్నగచింతున్ భవన్మహాత్మ్యగుణ గణా
భ్యున్నతిఁ గాంచనమణి సం
పన్నము సమకూడునమ్మ! పండిళ్లమ్మా॥ 19

కం॥ సంగత మడంగ కేళీ
శృంగారమతాళివి సరసిమె కృతి భావో
త్తుంగ తరంగ ప్రేంఖా
భంగగతుల నూగుమమ్మ! పండిళ్లమ్మా॥ 20

కం॥ భువి పరిమళింప, వ్యోమము
రవళింపగ, వాయువు విసర, నసల వరుణుల్
దివిఁగొనఁ గలాపిఁ జిల్లగ
భవదుత్సవ మొప్పునమ్మ ! వందిళ్ళమ్మా॥ 21

కం॥ భూటవితాళముల చతు
ర్వేదామలతంతులిల తనివీఁమహానటనా
ట్యాదృతి మారుతవీణా
వాదన మొనరింతువమ్మ ! వందిళ్ళమ్మా॥ 22

కం॥ పార్వతి ! ప్రకృతిరమామణి
సర్వతరులతాలతాంత సహితాంజలి శా
ఖోర్వరవుఁ గలిమిఁ లోచన
పర్వంబుగ బట్టునమ్మ ! వందిళ్ళమ్మా॥ 23

కం॥ మాయూరనటి; మృదంగం
బా! యన ఘనముఱుము, గాలి బయకాఁడై త్రి
స్థాయిల నందుచు బాడఁగ
బాయకఁ దమినాడునమ్మ ! వందిళ్ళమ్మా॥ 24

కం॥ తెర యింద్రధను స్సభ్యుం
తరనాటకశాల పాత్రధరచాతకముల్
మెఱుపుల్ దివ్వెలు పరత
ల్పా రసమ్మ ? ప్రదర్శనమ్ము ! వందిళ్ళమ్మా॥ 25

కం॥ శాంకరి! గీర్వాణులె ని
కింకర కింకరులు పాడి గేయంబుల ని
శ్శంకగ గాహళ భేరీ
ఝాంకృతు లొనరింతురమ్మ! పందిళ్లమ్మా॥ 26

కం॥ నిను గొలువ శంఖ భేరీ
పణవ పటహ కాహళముఖ వాద్యధ్వనిక
న్నను బధిరగద్గదాన్య
ధ్వని వాద్యంబా గదమ్మ! పందిళ్లమ్మా॥ 27

కం॥ ఒక్కఁడె తనయుఁడు జ్వరమున
బొక్కుచు నున్నాడని భయమున మ్రొక్కిన యా
మ్రొక్కుం జెల్లించెద నీ
భక్తిగ కృతినందికొమ్మ! పందిళ్లమ్మా॥ 28

కం॥ నీపాదాబ్జమరందము
నా పుత్రుఁడు గ్రోలినకతనఁగదా! సంజ
వీపానంబును గొన్నటు
బాపుకొనెఁ రుజ నిజమ్ము పందిళ్ళమ్మా॥ 29

కం॥ నీ నామస్మరణంబా
నానావిధరోగవారణానివారణ బం
చానన మదిలేక యమృత
పానంబుగ వృథగదమ్మ! పందిళ్ళమ్మా॥ 30

కం॥ నాపట్టియన నిజంబుగ
నీపెట్టిన భిక్షమని గణించి యతని నే
జూపెట్టితి నిక దాసుని
బ్రాపై రక్షింపుమమ్మ! పందిళ్ళమ్మా॥ 31

కం॥ పసివాడు శాస్త్రగంగా
రసమజ్జన మాచరింపరా! యనుచు దయా
రసభోజనమిడి సుయశో
వసనంబుఁ గట్టనిమ్మ! పందిళ్లమ్మా॥ 32

కం॥ ఒకచో దుర్గయనగ వే
ఱొకచో గాళియన నింక నొకచో భ్రమరాం
బిక యన నిట్లంతట తా
వకతేజము వెలసెనమ్మ! పందిళ్ళమ్మా॥ 33

కం॥ భావింప నన్నపూర్ణవు
గావ? "యమృతమస్తు"నుచు సకాలమ్ముల యం
దీవాపోశనమిడి యం
బా! విందుల్ గూర్పుమమ్మ! పందిళ్లమ్మా॥ 34

కం॥ దాసుడ నీకనఁ దృప్తిగ
వ్యాసున కాహారమిడితివట! కాశిఁ నకా
దాసానుదాసుడని యుప
వాసమ్ముల నుంచకమ్మ! పందిళ్లమ్మా॥ 35

కం॥ శుంభనిశుంభాద్యాశర
దంభానిలఫణి! యఘాద్రిశతదంభోళీ!
జంభరిపు హృదయసారస
బంభరి! సనుబ్రోవుమమ్మ! పందిళ్లమ్మా॥ 36

కం॥ అలఁ గొమరుసామి వేలుపు
దళముల నడుపంగ నాఁడు దరినున్నటులే
యిలఁ దండుబాటయే తా
వలముగ నిల్చితివిసుమ్మ! పందిళ్లమ్మా॥ 37

కం॥ మగఁడు కిరాతుండయి ముం
దుగ జనుచుఁ బోయుసీ! యనుచు మెల్లన దా
వగుచుండ సురాపగతో
పగతో నిటనుంటివమ్మ! పందిళ్లమ్మా॥ 38

కం॥ శృంగార రసాకృతి నా
లింగనమిడి యుండె రామలింగాలయమం
దుంగంగ తదీయజల మ
భంగమధురతరము సుమ్మ! పందిళ్లమ్మా॥ 39

కం॥ పెంచ్చిన రిపువనికి న్గా
ర్చిచ్చగు నామందపాటిచినరాజును మా
త్సేచ్ఛావరుడయి యిటకుఁ
వచ్చి నినుఁ గొల్చెనమ్మ! పందిళ్లమ్మా॥ 40

కం॥ నీపేర నొక్క మామిడి
తోపా చినరాజు నాటె తోరంబగుచుఁ
జూపఱ దన్వగ నాతని
ప్రాపన తోఁడైతివమ్మ! పందిళ్ళమ్మా॥　　41

కం॥ అల మందపాటి చినరా
జలయక నీమ్రోల నిచటి యతిబలులతో మి
త్రులతోఁ జేసియు సాములు
బలిగుడులాడెనుగదమ్మ! పందిళ్ళమ్మా॥　　42

కం॥ అధికారస్థిరఁ గొని పుర
పృథు లైశ్వర్యంబు దనరఁ బరిపింపగ జోరుల్
బధమెది? ముదుసలి! యనగా
పధమది యంటివికదమ్మ! పందిళ్ళమ్మా॥　　43

కం॥ పొలిమేరతగవునఁ రిపు
బలములు చెలరేగ నట్టి నలనగుగాలిఁ
గొలిపి పగఱఁ గన్నులలో
పల కారం బిడితివమ్మ! పందిళ్ళమ్మా॥　　44

కం॥ మున్ను ప్రాంతపు గ్రామము
లన్నిట పందిళ్ళపల్లియనగా గడు బే
రెన్నిక గొన్నదియట వి
ద్వన్నిచయమ్మంటు(జుమ్మ! పందిళ్ళమ్మా॥　　45

క॥ ఘన యోగులకిది నెలవని
వినుపింపంగ కనుపర్తి వేంకటార్యమా
ర్యునికృతియా "కైవల్యన
వనీతము" గలిగెఁగదమ్మ! పందిళ్ళమ్మా॥ 46

క॥ ఆతతవీణాచార్య
ఖ్యాతిఁ రాట్సభల భావ్యకాచార్య తనూ
జాతత్రయగానం బా
పాతమధురమిచ్చెనమ్మ! పందిళ్ళమ్మా॥ 47

క॥ పందిళ్లపల్లి నీకుఁ
మందిర మిందున్న జనసమాజము సంతో
సందియమేలా? నను మను
షం దయతోఁ జూడుమమ్మ! పందిళ్లమ్మా॥ 48

క॥ ఇది జన్మభూమియైనను
పదపడి సాహితిని వేటపాలెమ్మున నే
జదివితి తత్ఫలము భవ
త్పదభజనఁ గలుగునమ్మ! పందిళ్ళమ్మా॥ 49

క॥ జననివలె జన్మభూమియు
గణనీయంబంటి నిక భగవతివి నిన్నుఁ
గనుగొంటిఁ మది నీపద
వనజము లిడుకొంటినమ్మ! పందిళ్లమ్మా॥ 50

కం॥ దుండగముగ బీటలపై
బెండిలి దప్పింప దగవు బెట్టుకొనిన యా
మొండిశిఖండుల పాపము
పండుట యేనాటికమ్మ! పందిళ్లమ్మా॥ 51

కం॥ పురమర్దను బిచ్చుబరక
న్నరమరగొని యొక్కొ-కప్ప డరయవరీగపీ
శ్వరరోషాగ్ని రిపువరం
పరాటవినిఁ గాల్చునమ్మ! పందిళ్లమ్మా॥ 52

కం॥ సద్భక్తకవిమనక్షో
భోద్భూతాభీలబాడబోమర్ముధకీ
లోద్భటము ద్విషదుదధి సం
పద్భరముగా బీల్చునమ్మ! పందిళ్లమ్మా॥ 53

కం॥ కట్టిడుల దిట్టవలదా
కుట్టకయే యున్నఁ దేలుఁగుమ్మరిపుర్వాం
చట్టి హసింతురు జను లి
ప్పట్టున గనిపెట్టుమమ్మ! పందిళ్లమ్మా॥ 54

కం॥ కవి కపకృతి గావించుట,
శివనిందయొనర్చుట, ఫణి జెనకుట, సాధ్వీ
నివహముఁ జెఱుపదలంచుట
పవిగొని ముద్దాడుటమ్మ! పందిళ్లమ్మా॥ 55

కం॥ కొట్టిరె? తొల్లికవుల్ దగ
దిట్టరి యారి నర్థినన్ను దీవించి సిరుల్
వెట్టిరి నీబలమున కవి
పట్టంగొమ్మవుకదమ్మ! పందిళ్లమ్మా॥ 56

కం॥ సుస్మేరాస్యసుధన్నను
విస్మయముగ బెంచి క్రోధవీక్షణశిఖిచే
నస్మచ్ఛత్రుగళాటవి
భస్మము గావింపుమమ్మ! పందిళ్లమ్మా॥ 57

కం॥ దుష్టులు నిందల కోర్చియ
రిష్టంబులు వెట్టుచుండరె? కలమునను దు
ర్చేష్టలకలిమి నిహపర
భ్రష్టులసం బడుదురమ్మ! పందిళ్లమ్మా॥ 58

కం॥ గ్రంథరచనాప్రవీణ ధు
రంధర కవిగంధసింధురంబేనను గ
ర్వాంధుడు నిను వేడక భవ
బంధము తెగుటెట్లులమ్మ! పందిళ్లమ్మా॥ 59

కం॥ శ్రుతియు తృతీయశ్రుతియగు
ద్రుతమ్మహామ్మతి మొదట నొదుగ నొదుగు గలా
ప్రతిభ నినుబాడు సుకవి
ప్రతతికి యశమబ్బునమ్మ! పందిళ్లమ్మా॥ 60

కం॥ యతి యతికొ వెంబడిబడు
వతి కతిపావన పావనముగు పదగతి దు
ర్గతియగు సుకవికి గీర్తి
ప్రతిపత్తి యొసంగదమ్మ! వందిళ్లమ్మా॥ 61

కం॥ నీరూపకల్పనంబున
బూరుషుడు గడించు నిత్యమోక్షమ్మును కా
కేరు ధనమదాంధుల నే
వారతిఁగొన నేర్తురమ్మ! వందిళ్ళమ్మా॥ 62

కం॥ నీమహిమంబును దెలియక
పామరుడయి స్వీకరించు బరమతము నరుం
డా మోక్షపదవి నందక
బాముల బడుచుండునమ్మ! వందిళ్ళమ్మా॥ 63

కం॥ ఇచ్చియుఁ గడిపెడు బిడ్డల
దచ్చతురతమాయగ విధిదారిద్ర్యము పై
పెచ్చుగనిడె నీవిక నం
వచ్చయమిడి ప్రోవుమమ్మ! వందిళ్ళమ్మా॥ 64

కం॥ దుష్టకనిగ్రహ మిట్టుల
కష్టమ్ముల పాలుజేసి కలచుచునుండన్
నిష్టన్నిను గొలిచెద దద
వష్టంభన మాపుమమ్మ! వందిళ్ళమ్మా॥ 65

కం॥ ఒడలిం జందన మలఁదినఁ
బడుకొన్నన్ బూలపాన్పుపయిఁ బాయసమున్
గుడిచిన సుఖము ఋణాగ్నిం
బడిన నరుం డందడమ్మ! పందిళ్లమ్మా॥ 66

కం॥ భూధారిణి! నీనాథు న
నాథుడనై పెండ్లిగాక నాడడిగితి నిల్
నీధర్మాన గలిగె ఋణ
బాధను నేడడఁపుమమ్మ! పందిళ్లమ్మా॥ 67

కం॥ వేధకునైనను దుస్సహా
మీాధర మానవున కలవియే? భరియింపన్
సాధనమగు నీకృప ఋణ
బాధానల మార్పుమమ్మ! పందిళ్లమ్మా॥ 68

కం॥ పాథోధిఁబుట్టి గరళము
వేధోండము గాల్పజూడ వే మ్రింగిన గం
గాధరునకు గృహిణివి ఋణ
బాధానల మార్పుమమ్మ! పందిళ్లమ్మా॥ 69

కం॥ గాధితనూజుడు చంద్రమ
తీధవునిన్ దీనదశకు దెచ్చుట కనువా
సాధన మెది? యని నా ఋణ
బాధానల మార్పుమమ్మ! పందిళ్లమ్మా॥ 70

కం॥ తనువునఁ గార్శ్యము జూపున్
మనమున ధృతిమాపు, నోట మాటయు నాపున్
ఋణబాధ కెవండోపున్
వ్రణబాధయె మేలు సుమ్మ! సందిళ్ళమ్మా॥ 71

కం॥ రాజ్యంబున్ గవితాసా
మ్రాజ్యంబునకున్ సమానమా? యని దైనన్
భోజ్యాతురునిం జేయక
ప్రాజ్యయశోధనములిమ్మ! పందిళ్లమ్మా॥ 72

కం॥ జననీ! నిను బొగడవలం
తునుపో! సంగీతసాహితులు నేను న్నే
నని ముందునడచు నీపా
వననామాక్షరబలమ్మ? పందిళ్ళమ్మా॥ 73

కం॥ అఁబా కృతిబాడుచు రా
గం బాలాపనము సేయగా డెందము దే
హంబు మఱచి సంసృతితా
పంబున్ గనకుండెనమ్మ! పందిళ్లమ్మా॥ 74

కం॥ వేడుచు నాడుచు పాడుచు
వీడక నినుగొల్చు భక్తవితతికి సతమున్
దోడయి సంపదలిడి కా
పాడెదు దేవతవుసుమ్మ! పందిళ్ళమ్మా॥ 75

కం॥ కనుమూసిన గన్నాఱచినఁ
బానరగ బ్రహ్మాండభాండముల నిండిన నీ
తనుకాంతి మహానందవు
వనధి న్ననుదేల్చె నమ్మ! వందిళ్లమ్మా॥ 76

కం॥ నీకరుణగొన్న భక్తున
కాకలి దప్పియు నిదురయు నార్తి భయంబుఁ
జీకులు రావంచు నమో
వాకము లర్పింతునమ్మ! వందిళ్ళమ్మా॥ 77

కం॥ నిను నగము పొగడినంతనె
నను మెచ్చియు నాదిభట్ట నారాయణదా
సునిచే బిరుదంబును దీ
వన మిప్పించితివి నమ్మ! వందిళ్ళమ్మా॥ 78

కం॥ నీకొలువుసేయు భక్తుల
కేకాలంబునను గొఱత యేర్పడదనుచుఁ
నాకెఱుకపడె నిజమ్మని
వాకొనుచున్నాడనమ్మ! వందిళ్లమ్మా॥ 79

కం॥ ధృతియు, శ్రుతిలయజ్ఞానా
దృతి నిశ్చలమతి ప్రతాపతీవ్రాగ్నిలన
ద్యుతి సద్గతి యిడు నీకుఁ
బ్రతిదేవత లెవ్వరమ్మ! వందిళ్లమ్మా॥ 80

క॥ ధారాదృతిఁ గవిత నని
ధారాదృతి జగతి నంతతయశమ్ము జలా
ధారాదృతి గేదార మ
పారాదృతిఁ జూపుమమ్మ! వందిళ్ళమ్మా! 81

క॥ కారము పసిబిడ్డల కోం
కారము వేదమున కఖిలకామితఫలదా
కారము శిష్టులకిడు నం
భారము నీసొమ్మనుమ్మ! వందిళ్ళమ్మా! 82

క॥ హారము మణి ఫణియుతము, వి
హారము దీనావనార్ధ మనురచమూసం
హారము కృత్యము మహిమ మ
పారము నీకు గలదమ్మ! వందిళ్ళమ్మా! 83

క॥ కరము నిరంతరదానా
కరము గభీరగుణమణినికరమా? రత్నా
కరము నిగమభాస్వరమా?
స్వరము నిను౯ గొల్తునమ్మ! వందిళ్ళమ్మా! 84

క॥ దారమున౯ జేటయు, మం
దారమున౯ బూలతోఁట, ధన్వనమున౯ భూ
దారమున౯ వేట, భవద
పారకృప౯ వెలయునమ్మ! వందిళ్ళమ్మా! 85

కం॥ పారమునఁ బైరుల సం
సారమునఁ బాసురులను చండామితదో
స్సారమునఁ వీరులను క్రౌ
పారతి బెంతువుగదమ్మ! పందిళ్ళమ్మా॥ 86

కం॥ రాగం బర్ధులజూడ వి
రాగం బొగిపీడ ధనపరాగము సంధ్యా
రాగం బర్యాసుమేడ బ్ర
భాగరిమం బిడితినమ్మ! పందిళ్ళమ్మా॥ 87

కం॥ సారము గన్పింపని సం
సారము మెడగట్టుకొని విచారము భయవి
స్తారము గనినాడను వి
స్ఫారముదం బీయుమమ్మ! పందిళ్లమ్మా॥ 88

కం॥ నమ్మనివాడు చెడు నిధా
నమ్మని నీనామకీర్తనము యాగవిధా
నమ్మని నమ్మిన భవతా
పమ్మనిశము దొలగునమ్మ ! పందిళ్లమ్మా॥ 89

కం॥ పద్మము వగగాలినడచు
పద్మము నూత్న పరిమళము బరగించు మహా
పద్మము సుఖమిదు నీపద
పద్మము మోక్ష మిదునమ్మ ! పందిళ్లమ్మా॥ 90

కం॥ పారము గన్పడని యకూ
పారము కద! సంసృతి గడవగ స్మరణ వ్యా
పారము శాకితర వ్యా
పారము పనిసేయదమ్మ! పందిళ్లమ్మా॥ 91

కం॥ వనమా మునులకు, ఘనజీ
వనమా నమరులకు, దారపతులకు నవయౌ
వనమా పతితులకును పా
వనమా, నీస్మరణమమ్మ! పందిళ్ళమ్మా॥ 92

కం॥ వారము సింగమ్మగు బరి
వారము సురవార మాయవారము సేయన్
వారముఁ బంపెదవా ప్రీతి
వారమునకు దగునటమ్మ! పందిళ్ళమ్మా॥ 93

కం॥ కుశము కలుగ విప్రుం డం
కుశము కలుగ మావటీడు, క్షోణిపతి నిరం
కుశము కలుగ తనవశమున్
వశమై చరియించునమ్మ! పందిళ్ళమ్మా॥ 94

కం॥ పొందుగ పద్యము సిరిగల
పందల కందించు టూరబందుల మెడలో
గందము పూయుట రసికుడు
పందలకొఱ కుండడమ్మ! పందిళ్లమ్మా॥ 95

కం॥ దొడ్డసిరిగలుగ దెలియని
గుడ్డి కనునె? కవిత సొంపుగులుకుదు తెలుగుల్
తెడ్డెఱుగునె? కూరలరుచి,
వడ్డనకే తగుగదమ్మ! పందిళ్లమ్మా॥ 96

కం॥ లిబ్బి తిరంబని యుబ్బుచు
గబ్బువుగూర్పరుల గనకు కని వెలయాంధ్రోక్తిన్
తబ్బిబ్బె రొయిక్కొకరుడు,
వబ్బంబుగ నిచ్చునమ్మ! పందిళ్లమ్మా॥ 97

కం॥ ఉరుగౌరవ పదవులకై
కరమర్థి నొనర్చెద రధికాత్మకువిం దా
మెఱమెచ్చుల దాతలకున్
బరమార్థము దొరకదమ్మ! పందిళ్లమ్మా॥ 98

కం॥ పాయము పోనుండె, జరా
పాయము రానుండె, ముక్తిబడయుటకు మహో
పాయము లేకుండె, నభి
ప్రాయము సెలవొసగుమమ్మ! పందిళ్లమ్మా॥ 99

కం॥ గాటపుభక్తిన్ డెందవుఁ
బీటపయిన్నిల్పి నిన్ను వేడితి నికనే
నాటికి మోక్షద్వారక
వాటము దెఱపింతువమ్మ! పందిళ్లమ్మా॥ 100

క॥ దూలించితిఁ గామాదుల,
నాలించితిని శ్రుతి ధనమదాంధులకొలువుం
జాలించితిఁ బితృవాక్యముఁ
బాలించితిఁ బ్రోవుమమ్మ! వందిళ్ళమ్మా॥ 101

క॥ మీసలుదువ్వని వయసున
జేసిన పనులెల్ల జెప్ప సిగ్గగు నాకే
దోసములై యిపుడు దుర
భ్యాసములై తోచెనమ్మ! వందిళ్ళమ్మా॥ 102

క॥ తెరువయ్యె నిరులు పాముం
గఱచిన నదియొక్క దోమకాటుగ నుండెన్
నెఱదయ్యెము సఖుడయ్యెన్
పరికింపగ వయసునందు వందిళ్ళమ్మా॥ 103

క॥ వేరేల మహాపాతక
తోయధిలోబడితిని కృపతోడ ననున్నీ
చేయూతయొసగి యిక నిర
పాయమ్మగు మోక్షమిమ్మ! వందిళ్ళమ్మా॥ 104

క॥ శక్తివని తొలఁత నామ్నా
యోక్తముగ గొలువ సురాళి నోమి నరలకున్
ముక్తియొసగుదువు నీకిది
భక్తావనదీక్షసుమ్మ! వందిళ్ళమ్మా॥ 105

కం॥ అమ్మా! భగవతివని నిను
నమ్మియు నీదగు సహస్రనామంబుల నే
నెమ్మిఁజపించెద భవతా
సమ్మను దొలగింపుమమ్మ! వందిళ్ళమ్మా॥ 106

కం॥ భోగము త్యాగము మహితో
ద్యోగమ్ములన్నిటను భక్తియోగమునన్ నం
యోగంబగుఁ గవికని నీ
బాగుగఁ బ్రార్థింతునమ్మ! వందిళ్ళమ్మా॥ 107

కం॥ కంజజ నారాయణ మృ
త్యుంజయులను దారిజూపుదువు నీ తేజః
పుంజంబున భక్తమనః
పంజరపుం జిలుకవమ్మ! వందిళ్లమ్మా॥ 108

కం॥ ఇంధనసములౌని ద్రవ్యము
దాంధుల గోపాగ్నిగాల్చి యడతువు తన్ని
ర్బంధమ్ముల, భక్తిగహన
పాంథుడ నను గావుమమ్మ! వందిళ్లమ్మా॥ 109

కం॥ వరమడిగెదను చతుర్విధ
పురుషార్థమ్ముల నొసంగి ప్రోవుమనుచు నీ
వరమరగొన కర్దానిన్
ద్వరగ బ్రసాదింపుమమ్మ! వందిళ్ళమ్మా॥ 110

కం॥ వాస్తవముగ నిన్ బోలిన
నిస్తుల మోక్షప్రదాత్రి నిన్నే గానన్
దుస్తర భవజలధికి నీ
ప్రస్తుతి నౌకయగునమ్మ! పండిళ్ళమ్మా॥ 111

కం॥ సూక్తంబులు ఘోషించున్
శాక్తేయం బతుల మోక్షసాధనమని నీ
భక్తి లభించుట జనులకు
ప్రాక్తనపుణ్యముననమ్మ! పండిళ్లమ్మా॥ 112

కం॥ పూరుషుడు పురాణాగమ
పారంగతుడగుచుగాక బడయునె మోక్షం
బారయ నీపదభక్తిన్
వారక లభియించునమ్మ! పండిళ్లమ్మా॥ 113

కం॥ నరుడార్తి దూలునప్పుడె
స్మరియించున్ మఱచుచుండు స్వాస్థ్యముగొని నిన్
స్థిరభక్తి గొలువకెట్టుల
పరమార్థము దొరకునమ్మ! పండిళ్లమ్మా॥ 114

కం॥ కొలువు సుఖంబుల పెంపున్
గొలువు విమోహాపరవశులకున్ బాపున్ మే
ల్కొలుపు నరికెడగొలుపు బ్రా
బలుకుల నీకొలువునమ్మ! పండిళ్లమా॥ 115

కం॥ జవనత్వనిధానము లా
జవంజవ విభేదనములు సర్వగుణాగ్రా
ర్జవ సాధనములుగావా
భవదంఘ్రులు గొల్తునమ్మ! వందిళ్ళమ్మా॥ 116

కం॥ ఇల సహజగానకవితా
విలాసులను దెలిసి గౌరవింపగలరె? మ
ర్త్యులు; ధనమిడనేర్తురు నీ
వలె ముక్తినిడరుగదమ్మ! వందిళ్ళమ్మా॥ 117

కం॥ అర్థినయి భక్తితోడన్
బ్రార్థనముఁ జేయుచుంటి పైనుండెదు త
త్స్వార్థం బెఱిఁగించి యశో
వర్ధనముఁ సలుపుమమ్మ! వందిళ్ళమ్మా॥ 11

కం॥ కస్తిబడియైన సలుప ను
పాస్తిస్స్వరూప మెలమి గనబఱతువు ప్రణవం
బాస్తికతకు మూలంబని
వాస్తవ తత్త్వముగనమ్మ! వందిళ్లమ్మా॥ 1

కం॥ సుకవులు దరిద్రతృష్ణా
గ్నికిదాళక లుబ్ధుడగు ధనికగృహమ్ముగత్తృ
ష్ణగడకుజని యెదియుం దో
షక నిను దలతురుగదమ్మ! వందిళ్లమ్మా॥

కం॥ తమ సంపదలన్నియు ని
త్యములని నమ్మికొని ధన మదాంధులు "ధనమూ
లమిదంజగత్తొ"టంచును
భ్రమచే గర్వింతురమ్మ! పందిళ్లమ్మా॥ 121

కం॥ కవి పండిత గాయక నట
నివహంబుల గాంచి లోభి నిలువున నీరై
శవమటు పల్కడు కొండయు
బవియన నెట్లుండునమ్మ! పందిళ్లమ్మా॥ 122

కం॥ నీరమణువలచి సఖయై
భైరవుని గన్న విష్ణువైనలుగవు భా
గీరథియె లోకువా? మన
వారని నీకున్నదమ్మ! పందిళ్లమ్మా॥ 123

కం॥ రాజులు కవిరాజులు రిపు
రాజిగెలువ శస్త్రశాస్త్రరాజి నొసగి నీ
తేజము గన్పరుతువు వి
భ్రాజిత పుణ్యాత్మవమ్మ! పందిళ్లమ్మా॥ 124

కం॥ నాయెడదతుమ్మెద రొదం
జేయు నెనరుజేనెనానిచెందక దనివిన్
నీ యడుగుండమ్ముల నెడ
బాయంజాలదుగదమ్మ! పందిళ్లమ్మా॥ 125

కం॥ అగపడుమమ్మా! కనులగోల
తెగుతేర్పడె నాకు జ్ఞానదృష్టిం బ్రసాదిం
పగనగు కృపాంజనముదా
పగనేల? వెల శతకమ్మ! వందిళ్ళమ్మా॥

కం॥ అంబా! యీ శతకము ని
త్యంబు జదువువారి కాయురారోగ్యైశ్వ
ర్యంబులిడి కొనుము! సుతలా
భంబని దీవింపుమమ్మ! వందిళ్ళమ్మా॥

కం॥ జయజయ జయకాత్యాయని!
జయజయ శర్వాణి! మృదుల సారసపాణీ!
జయజయ హైమవతీ! భవ
భయము౯ దొలగింపుమమ్మ! వందిళ్ళమ్మా॥

కం॥ మంగళము! గుణశ్రేణీ!
మంగళము! వినీలవేణి! మంజులవాణీ!
మంగళము! సువాణి! కృపా
పాంగములం జూడుమమ్మ! వందిళ్ళమ్మా॥

కం॥ శతకపు పళ్లెరమున నం
స్తుతి తైలమిడి వెలిగించి సుయశోజ్యోతి౯
ధృతి అచ్చయకవితాగుణ
వతి హారతి బాడెనమ్మ! వందిళ్లమ్మా॥

సమాప్తము.

# ప్రకటన.

## శ్రీకృష్ణావతారమహాభారతము.

గేయప్రబంధము—ఐదుపర్వములు.

ముప్పది హరికథాకాలక్షేపములు.

సంగీతమునకు సెలయేఱు! సాహిత్యమునకు బిడారు! నీతులకుఁ గొటారు! ఉపాఖ్యానములకు బారు! ఇందు భారత భాగవత హరివంశములయందుగల పాండవ ధార్తరాష్ట్రుల చరిత్రములును, శ్రీకృష్ణు డాబాల్యంబుగ గనబఱచిన యద్భుత మహిమంబులును నవరసభరితముగ వర్ణింపఁబడినవి. మఱియు "హరికథాపితామహ" బిరుదాంచితులు, సంస్కృతాంధ్రాంగ్ల పారశీకాదిక బహుభాషాకోవిదులు, సహజనృత్యగానకవితా వినోదులు నగు బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారిచే రచింపఁబడిన (వేదవేదాంగముల సారమనఁదగి నృత్యగాన కవితావిద్యల మహిమమును వివరించు) గొప్ప పీఠికయుంగల ఈ గ్రంథమును సకల జనముల కందించు నుద్దేశముతో ఒక్కొక్క పర్వము వెల రు 1—0—0 మాత్రమే నిర్ణయింపఁబడినది.

వలయువారిట్లు వ్రాయుడు!

కట్టా అచ్చయ్యా

వేటపాలెం,

బాపట్ల తాలూకా, (గుంటూరుజిల్లా.)